


వై. ద్లుగొలేన్‌స్కీ

# గడియారాల గురించి నీకు తెలుసా?

# పొడుపు కథలు

ప్రతి వాళ్లకీ పొడుపు కథలంటే యిష్టం. నీకూ అవంటే యిష్టమే, కదూ.

యిప్పుడు మనం రెండు పొడుపు కథలతో మొదలెడదాం.

అస్తమానూ నడుస్తూ వున్నా యెప్పటికీ చేరనిదేది?

నిశ్శబ్దంగా వుండే గదిలో "టిక్-టిక్," "టిక్-టిక్" అంటూ మాట్లాడేదేది?

ఏదో వూహించావా?

లేకపోతే యీ పేజీ తిప్పు అక్కడున్న బొమ్మే నీకు జవాబు.

ఆఁ! రైట్, అది గడియారం, అలారం గడియారం.

యిప్పుడు సరిగ్గా దానిలాగానే వున్న గడియారాన్ని తయారుచేద్దాం. మీ అమ్మనో, నాన్ననో, మామ్మనో, తాతనో నీకు సాయంచెయ్యమను.

తయారుచేశావా?

యిప్పుడు ముద్దొచ్చే యీ గడియారాన్ని పక్కన పెట్టి, కాలాన్ని గురించీ, టైముని చెప్పడం గురించీ ముచ్చటించుకుందాం.

# టైమ్‌ని చెప్పే రెండు పద్ధతులు

టైమ్‌ని చెప్పడానికి యెన్నో పద్ధతులున్నాయి. రెండింటిని గురించి చెబుతాను.

ఒక అబ్బాయి వున్నాడు. ఎవరేనా టైమెంతైందని అడిగితే వాళ్ల మామ్మ దగ్గరికి పోయి గడియారం చూడమంటాడు. ఆమె చూసి రెండనో, మూడనో యెంత టైమ్ అయితే అంత అతనికి చెప్తుంది.

యిది వొక పద్ధతి.

యింకో అబ్బాయి వున్నాడు. అతను గడియారం దగ్గరకి వెళ్లి కాసేపు చూసి యెప్పుడూ పొరపాటు చెయ్యకుండా తనంతట తనే టైమ్ చెప్తాడు.

మనం యీ రెండో పద్ధతిని నేర్చుకుందాం.

మొదలెట్టే ముందు నువ్వు ఒకటి గుర్తుపెట్టుకోవాలి. టైమ్‌ని పెద్దా, చిన్నా అనే భాగాలుగా విభజించారు. చాలా కాలం కితమే లోకులు దాన్ని గురించి ఒక మాటకు వచ్చి, అది అలా వుండాలని నిర్ణయించారు.

ఆ భాగాలకి పేర్లు పెట్టారు:

పెద్దదాన్ని గంట అన్నారు,

చిన్నదాన్ని నిముషం అన్నారు,

అతి చిన్నదాన్ని సెకను అన్నారు.

వై. ద్లుగొలేన్‌స్కీ



# గడియారాల గురించి నీకు తెలుసా?





"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో • 1983

# టైమెంతయింది?

నీ ముద్దొచ్చే అట్ట గడియారం తీసుకో. అచ్చంగా యిది అసలు గడియారం లాగానే వుంది.

యిది ఒక వృత్తం, అంటే ముఖం. దానిమీద ఒకటినుంచి పన్నెండు దాకా అంకెలు వున్నాయి.

దీనికి రెండు ముళ్ళున్నాయి. ఒకటి పెద్దదీ, యింకోటి చిన్నదీ.

దీనికి లేనిదల్లా యీ ముళ్లని తిరిగేటట్టు చేసే మరలే. పోన్లెండి, మరలు లేకుండా మనం గడియారాన్ని తిప్పదాం.

పెద్దా, చిన్నా ముల్లులు రెండింటినీ 12 అంకెమీద పెడదాం. అలా పెడితే యేమిటో తెలుసా? టైమ్ పన్నెండు గంటలయిందని.

పెద్ద ముల్లుని అక్కడే వుంచేసి చిన్న దాన్ని తిప్పు.

దాన్ని 1 అంకెమీదకి తిప్పు. అలా పెడితే ఏమిటో తెలుసా? టైము కచ్చితంగా ఒంటి గంట అయిందని.

చిన్న ముల్లుని 2 మీదకి తిప్పితే? అంటే అప్పుడు రెండు గంటలైందన్న మాట.

అక్కణ్ణుంచి 11 అంకె దాకా తిప్పితే యేమవుతుంది?

టైమ్ పదకొండు గంటలైనట్టు.

పెద్ద ముల్లు 12 దగ్గరుండగానే, చిన్న ముల్లు సూదిగా వుండే తన కొనని ఒకటో, రెండో, అయిదో, ఏడో, పదకొండో, పన్నెండో యే అంకెమీదకి తిప్పితే అంత టైమైందన్న మాట. మీ అమ్మ ''టైమెంతయిందీ?'' అని అడిగితే కచ్చితంగా అంత అని నువ్వు చెప్పగలవు.

యిప్పుడు పెద్ద ముల్లుని 6 మీద వుంచి చిన్న ముల్లుని తిప్పు.

చిన్న ముల్లుని 12కీ 1కీ మధ్య వుంచు. టైమెంతైంది? పన్నెండున్నర అయింది.

చిన్న ముల్లుని 1కీ 2కీ మధ్యన వుండేటట్టు పెట్టు.

టైమ్ ఒంటి గంటన్నర అయింది.

చిన్న ముల్లుని 2కీ 3కీ మధ్యన వుంచితే టైమ్ రెండున్నర.

గుర్తుంచుకో. పెద్ద ముల్లు 6 మీద వుండి చిన్న ముల్లు రెండు అంకెల మధ్యన వుంటే పన్నెండున్నరో, అయిదున్నరో, పదిన్నరో, చిన్న ముల్లు యే అంకె దాటి వస్తే అంత టైమ్ అయినట్టు.

యిప్పుడు చెప్పు. పెద్ద ముల్లు 6 మీద వుంది. చిన్న ముల్లు 11కీ 12కీ మధ్య వుంది. టైమ్ యెంత అయినట్టు?

పదకొండున్నర!

నువ్వు చెప్పింది రైటే? ఆఁ, రైటే. అయితే టైమ్ చూడ్డం గురించి నీకు బోలెడు తెలిసిందన్న మాట.

మరి యీ పేజీ తిప్పదాం.



# కోడిపుంజూ, సమొవార్, అలారం గడియారం

మనుషులకి టైమ్ చెప్పే గడియారాల పటాలం నీకు కనిపిస్తోందేం.

యింతకాలం దాకా వున్న అన్ని గడియారాల బొమ్మలనీ చిత్రకారుడు గియ్యలేదు. అబ్బో, అవి యెన్ని వున్నాయో లెక్కలేదు.

యిలాంటి గడియారం విమానంలో వుంటుంది.

యిలాంటిదో! రోదసీ నౌకమీద వుంటుంది.

యిది ఆటల పోటీల్లో జడ్జీలు వాడే స్టాప్—వాచీ.

యిది చదరంగపు గడియారం.

యిది అలారం గడియారం.

యిది ఓడల్లో వాడేది, క్రోనోమిటర్. సముద్రగడియారం అందాం.

యీ గడియారాల గురించి యింకా యెక్కువ చెబుతాను. కాని చిత్రకారుడు ఓ కోడిపుంజునీ, పెద్ద రష్యన్ టీ పాత్ర సమొవార్‌నీ గీసాడెందుకా అని నువ్వు ఆశ్చర్యపోతున్నావేం?

యెందుకు గీసాడంటే కోడిపుంజు కూడా ఒకరకమైన గడియారమే. సజీవ గడియారం, యంత్రంది కాదు. పూర్వ కాలంలో మనుషులకి గడియారాల్లేనప్పుడు వాళ్లకి కోడిపుంజులే టైమ్ చెప్పేవి.

పొద్దున్నే కోడిపుంజు కూస్తే తెల్లవారిందనీ, నిద్రలేచే వేళ అయిందనీ అర్థం. సాయంత్రం అది గూడు దగ్గరికి వస్తే (కోళ్లు గూళ్లల్లో తీనెలమీద పడుకుంటాయి, తెలుసా) నిద్రపోయే వేళ అయిందని అర్థం.

కానీ కోడిపుంజుని యెల్లప్పుడూ నమ్మకోలేం కదా. అది ఒకో అప్పుడు గూట్లో తీనెల మీదనుంచి పిల్లిమొగ్గలేసి పడి, వేళ కాకుండానే ''కొక్కొరోకో'' అని కూత వెయ్యొచ్చు. యింకో అప్పుడు కోళ్లగూట్లోకి నక్క దూరి కోడిపుంజుని యెత్తుకు



పోవచ్చును. అప్పుడు మనుషుల్ని లేపడానికి యెవరు వుంటారు?

అంచేత యింకొంచెం నమ్మకమైన గడియారాన్ని కనిపెట్టారు. అది పిల్లిమొగ్గలేసి గూట్లోంచి పడదు. దాన్ని నక్క భోంచెయ్యలేదు.

చూశావా అందుకనే యీ పేజీమీద ఓ సమొవార్‌ని కూడా చిత్రకారుడు గీశాడు. సమొవార్ కూడా ఓ గడియారమే, నీటి గడియారం. సమొవార్‌లో ఓ బాల్చీ నీళ్ల పోసి, కుళాయి తిప్పేవాళ్ళ. బాల్చీడు నీళ్లూ సమొవార్‌లోనుంచి కారిపోవడానికి ఒక గంట పడుతుందని వాళ్లకి తెలుసు. నీళ్ల అన్నీ కారిపోయాయనుకో, ఒక గంట అయిందన్న మాట. అప్పుడు యింకో బాల్చీడు నీళ్ల పోసే వాళ్ల. రోజంతా అలా నీళ్ల పోస్తూనే వుండాల్సివచ్చేది.




అది మరీ పాత గడియారం. యెనిమిది వందల యేళ్లకితం ముళ్లూ, యంత్రమూ, అంకెల ముఖమూ వున్న గడియారాన్ని కనిపెట్టక పోయివుంటే మనం దాన్నే వాడుతూ వుండేవాళ్లం.

ఆ గడియారం యిలా వుండేది.

పదిమంది కలిసినా దాన్ని యెత్తలేరు.

పట్టణం మధ్యలో యెత్తుగా వుండే గోపురంమీద దాన్ని పెట్టేవాళ్ల. అందుకనే దాన్ని గోపుర గడియారం అనేవాళ్ల. ఆ పట్టణంలో అదే ప్రధానమైన గడియారం.




అలాంటి గడియారాన్ని యెవళ్లూ యింట్లోకి పట్టికెళ్ల లేరు కదా. అంచేత మనుషులు యిళ్లల్లో వాడుకోవడానికి చిన్న గడియారాలు తయారు చెయ్యాల్సి వచ్చింది. యిళ్లదే అదృష్టం, యిళ్లల్లో వాడుకోడానికి యెన్ని గడియారాలున్నాయో.

అవి:

పొయ్యి తీనెమీద వుండే గడియారం;

గోడమీద వేలాడే గోడ గడియారం;



పొడుగుపాటి కొయ్యపెట్టెలో పనిచేసే నేల గడియారం;

ఆఖరికి బల్ల మీద పెట్టుకునే బల్ల గడియారం.

సైనికులూ, ప్రయాణీకులూ సంచరించడానికి పేరు మోసిన వాళ్ళూ యిళ్ల దగ్గర వుండరు. అలాంటి వాళ్ల కోసం గడియారాలు తయారు చేసేవాళ్ళు చిన్న గడియారాలు తయారు చేశారు. వాటిని వాచీలు అంటారు. జేబులో పెట్టుకునేవి జేబు గడియారాలు. పట్టీతో మణికట్టు దగ్గర కట్టుకునేవి రిస్ట్ వాచీలు.

ఆఁ, యింకోరకం వాళ్ళున్నారు, యెంత పొద్దెక్కినా లేవని వాళ్ళు. వాళ్లని నిద్రలేపడానికి ఓ ప్రత్యేక గడియారం తయారుచేశారు.

అది అలారం గడియారం, అద్భుతమైంది. అలారం కీ యిచ్చి, యెప్పుడు నిద్రలేవాలో ఆ టైమ్ పెట్టి హాయిగా పడుకో. నిక్కచ్చిగా ఆ వేళకి, ఆ క్షణానికి, అలారం మోగుతుంది, "ట్రింగ్, ట్రింగ్" మని. (యీ నాటి అలారం గడియారాలు యింకా శ్రావ్యమైన ధ్వని చేస్తాయి.) నువ్వు లేచి పక్క యెత్తేస్తావు.

పూర్వం రోజుల్లో మనుషులు మొద్దు నిద్రపోయేవాళ్లేమో. వాళ్లకి మెల్లిగా "ట్రింగ్" మంటే చాలదు. అలాటి మొద్దునిద్రవాళ్లకి ప్రత్యేకమైన అలారం గడియారాలుండేవి.

ఫిరంగి గడియారం. ఫిరంగిని గడియారానికి కలిపేవాళ్ళు. నిర్ణీత సమయానికి గడియారం మందుగుండుని అంటించేది. అనుకున్న వేళకి ఫిరంగి మోగేది.

వుయ్యాలా గడియారం. దీని యంత్రాలు కొంచెం గందరగోళంగా వుంటాయి. అనుకున్న వేళకి అవి పక్కని వుయ్యాలా జంపాలా ఆడించేవి. దాంతోటి నిద్రపోయేవాడు యిష్టం వున్నా లేకపోయినా పక్క దులిపేసి లేవాల్సిందే.

యీరకం గడియారాలు మగవాళ్లకోసం.

అబలలైన ఆడవాళ్లకి అలారం గడియారాలు యింకొంచెం మృదువుగా వుండేవి.

ఉదాహరణకి నిద్రపోయే ఆవిడమీద, అత్తరో, నిమ్మరసమో





చిలికే అలారం గడియారం వుండేది.

కొంతమంది ఆడవాళ్లకి అత్తరు లేపిలే యిష్టం.

యింకొంతమందికి నిమ్మరసం.

ఆడవాళ్ల గడియారాలతోబాటుగా చిత్రకారుడు సముద్ర గడియారం కూడా గీశాడు. యిది లేకుండా వొక్క ఓడ కూడా బయల్దేరదు. మామూలు గడియారాలు సముద్రంమీద పనికిరావు. ఓడ అస్తమానూ వూగుతూ వుంటే అవి తట్టుకోలేవు. తప్పు టైమ్ చూపిస్తాయి.

పూర్వం రోజుల్లో యీ సముద్ర గడియారాల్లేవు. ఓడ కెప్టెన్లు దారి తప్పిపోయేవాళ్లు. ఓడలు మెరకేనా పట్టేసేవి, లేదా వెళ్లాల్సిన చోటికి ఆలస్యంగానేనా చేరేవి.

పాపం, వాళ్లు నమ్మకమైన గడియారం కోసం ఆశించడం సహజమే కదా.

సముద్ర నావికుల పోషకుడనుకునే ఒక స్పానిష్ రాజు వుండేవాడు. ఓడ యానంలో కచ్చితంగా టైమ్ చూపించే గడియారం కనిపెట్టిన వాళ్లకి పెద్ద బహుమతీ యిస్తానని ప్రకటించాడు. ఇంగ్లీష్ పార్లమెంట్ కూడా అలాగే చేసింది.

ఆఖరికి జాన్ హారిసన్ అనే ఆయన సముద్ర గడియారం కనిపెట్టాడు. ఆయన ఇంగ్లీష్ నౌకా దళాధిపతి కార్యాలయం దగ్గరికి వెళ్లి సముద్ర గడియారాన్ని బల్లమీద పెట్టాడు.

''ఏమిటది?'' అని ఇంగ్లీష్ నౌకా దళాధిపతులు అడిగారు.

''సముద్ర గడియారం. నౌకా కెప్టెన్ల కల.''

దాన్ని వెంటనే పరీక్షించారు. అది వుంచిన ఓడ ఒకటి సముద్రంమీద బయల్దేరింది. ఓడ దారి తప్పలేదు, సరిగ్గా అనుకున్న వేళకి అనుకున్న రేవుకి చేరింది.



బొమ్మలో సముద్ర గడియారానికి పక్కనే చదరంగం గడియారం వుంది. త్వరలోనే దాని శత వార్షికోత్సవం జరుగుతుంది.

దాన్ని కనిపెట్టడానికి ముందు ఓ చదరంగం ఆటగాడు ఒక యెత్తుకి పది నిముషాలు తీసుకుంటే, యింకొకడు బదులు యెత్తు వెయ్యడానికి రోజంతా గడిపేవాడు. నీకు మతిపోవడానికి అది చాలుకదా.

''కాలయాపన చెయ్యొద్దు'' అని వాళ్లు అతనితో అనే వాళ్లు.

''నేను కాలయాపన చెయ్యడం లేదు, వూరికే యెత్తు ఆలోచిస్తున్నాను'' అనే వాడతను.

యిప్పుడు ప్రతి ఆటగానికీ యింత టైమ్ అని యిస్తారు. అతను గనక తనకి కేటాయించిన టైములో వెయ్యవలసినన్ని యెత్తులు వెయ్యకపోతే గడియారంమీద ఓ ఎర్రజండా దిగుతుంది. ''బాబూ, మీ టైమ్ అయిపోయింది, మీరు ఓడిపోయారు'' అని దాని అర్థం.

యిప్పుడు నేను చెప్పిన గడియారాలన్నీ యింకా వాడకంలో వున్నాయి. అరిగిపోయిన మరల స్థానే పట్టుపట్టుకీ కొత్తవి పెడుతున్నారనుకో. యిప్పుడిక వాడకంలో లేని గడియారాలు ఫిరంగి గడియారం, సమొవార్ గడియారం, అత్తరు అలారం గడియారం. యిప్పుడు నీకు గడియారాల గురించి చాలా తెలుసు, టైమెంతయిందో చెప్పడం తెలుసు. ఏం? నేను నిన్ను కొన్ని అడుగుతాను....

## లోపల యేం వుంది?

యీ ప్రశ్న నీకే చాలా సార్లు తట్టి వుంటుంది.

అలగే అన్ని దేశాల్లోనూ, అన్ని కాలాల్లోనూ పిల్లలకి తట్టివుంటుంది.

నాకూ అంతే.

యింతకీ గడియారం లోపల యేం వుంది? ఎవరు ఆ పెట్టె లోపల కూర్చుని గట్టిగా "టిక్-టిక్," "టిక్-టిక్" మంటారు?

నేను చిన్న పిల్లవాడిగా వున్నప్పుడు, దీని అంతు తేల్చుకుందామని అనుకున్నాను. మా తాత దగ్గర ఉల్లిపాయలాంటి జేబు గడియారం వుండేది. ఒకోసారి ఆయన నాకు దాన్ని యిచ్చేవాడు. మా యింట్లో అలాంటి గడియారం లేదు.

మా తాత లేకుండా నేను ఒక్కణ్ణే గదిలో వున్న అదును చూసి,

గడియారపు తొడుగు విప్పేశాను.

మొదట పై అద్దం తీసేశాను. ముళ్ళు పీకేశాను.

అయినా గడియారం "టిక్-టిక్" మంటూనే వుంది.

గడియారపు పైభాగంలో యింకేమీ చెయ్యడానికి లేక పోయింది. అంచేత వెనక్కి తిప్పి మూత తీసేశాను. "టిక్-టిక్" మనేదేమిటో అప్పుడు కనిపించింది. కుదిమట్టంగా చక్కగా వున్న యంత్ర భాగాలు, లెక్క లేనన్ని చిన్ని బోల్టులు, పళ్ల చక్రాలు, సున్నితమైన స్ప్రింగు బిగుతైన చుట్టలు కనిపించాయి. మొత్తం



యంత్రమంతా కదులుతూ, తిరుగుతూ, ''టిక్-టిక్'' మంటూనే వుంది.

మొట్టమొదటగా నా ఆసక్తికి బలైపోయింది సున్నితమైన స్ప్రింగు. అప్పుడు చిన్న పళ్ల చక్రాన్ని జాగ్రత్తగా చూశాను.

గడియారాన్ని నేను ధ్వంసం చేసిన విధానాన్ని వన్నెలు, చిన్నెలు పెట్టి వివరించడం అనవసరం. యిది జరిగిన చాలా కాలం దాకా మా తాత నాతో మాట్లాడలేదు. యుద్ధంలో సాహసకృత్యానికిగాను ఆయనకి ఆ గడియారాన్ని బహుకరించారు.

# పళ్లచేప, సుత్తి

రకరకాల గడియారాలున్నాయి. నీళ్లుపడ్డా, దుమ్ముపడ్డా, తాకిడి వున్నా తట్టుకోగలిగిన ప్రత్యేక గడియారాలూ ఉన్నాయి.

అంటే గడియారం తియ్యక్కర్లేకుండానే స్నానం చెయ్యవచ్చు, సుత్తి పట్టుకుని చేత్తో కొట్టే పని చెయ్యొచ్చు, గతుకులుగా, దుమ్ముగా వున్న రోడ్డుమీద సైకిల్ తొక్కవచ్చు.

వింతగా వుందా? దీనికి రుజువు కావాలంటే చూడు. ఒక బెస్తవాడు ఒక పెద్ద చేపని పట్టాడు. దాన్ని బాగు చేసేటప్పుడు లోపల ఒక గడియారం అతనికి కనిపించింది! అతను దానికి కీ యిచ్చాడు. గడియారం తిరగడం మొదలెట్టింది. యిప్పటికి మూడేళ్లుగా అది తిరుగుతూనే వుంది అని ఒక వార్తాపత్రికలో చదివాను.

చేప నీటిలో వుంటుంది కాబట్టి యీ గడియారం నీటికి తట్టుకుందన్న మాటేకదా.

యింకో వార్తాపత్రికలో యీకింది వార్త ఉంది. ''నేను వృత్తిరీత్యా చెప్పులు కుట్టేవాణ్ణి. నా పనంతా మేకుల తోటీ, సుత్తులతోటీనీ. నేను పని చేసేటప్పుడు యెప్పుడూ నా చేతి గడియారం తియ్యను. మొదట్లో నాకు భయం వుండేది. అదురు తగిలినా తట్టుకునే గడియారం కాబట్టి ఫరవాలేదని నాకు నమ్మకం కలిగింది. పదేళ్లుగా సుత్తి ఉపయోగిస్తూనే వున్నాను, కాని గడియారం తిరుగుతూనే వుంది.''

యింకొక వార్త చూద్దాం.

''యీ ఉత్తరం రాసే నేను ఒక తోటమాలిని. రెండేళ్లకితం నా గడియారం పోయింది. యీ వేసవికాలంలో అది ఒక యాపిల్ చెట్టు కింద నాకు కనిపించింది. రెండేళ్లుగా అది దుమ్ములో, వానలో, మంచులో అక్కడ అలా పడే వుందన్న మాట. నేను దానికి కీ యిచ్చాను. అది మళ్లీ తిరుగుతూనే వుంది. యింత అద్భుతమైన గడియారాన్ని తయారు చేసినందుకు గడియారాల ఫాక్టరీవాళ్లకి నా కృతజ్ఞతలు.''

యివాళ తయారయే గడియారాలు అలాంటివి.

పాతకాలపు గడియారాలు అలాంటి పరీక్షలకి నిలబడవు కదా.



# యుద్ధనౌకమీదకి గడియారం కాల్పు

అనేక దేశాల్లోని అనేక పట్టణాల్లో గోపురం గడియారాలున్నాయి.

నార్వే దేశంలోని ఒక చిన్న పట్టణంలో కూడా అలాంటిది ఒకటి వుంది. ఆ గడియారానికి సంబంధించి చిత్రమైన కథ చెబుతారు.

ఆ గడియారపు ముసలి కాపలాదారుడు ప్రతిరోజూ మెట్లెక్కి పైకెళ్లి గడియారం పక్కనే గోపురంమీద వున్న ఫిరంగిని గుండులేకుండా మందు దట్టించి పేల్చేవాడు. మధ్యాహ్నం అయిందని జనానికి తెలిసేది.

యుద్ధ సమయంలో ఆ పట్టణాన్నీ, గోపురాన్నీ, మొత్తం నార్వేనీ నాజీ సైనికులు ఆక్రమించేశారు. ఒక జర్మన్ యుద్ధనౌక ఆ పట్టణపు ఓడ రేవులో లంగరు దించింది.

మామూలుగానే ఆవేళ కూడా గడియారపు ముసలి కాపలాదారుడు మెట్లెక్కి పైకెళ్లాడు. కాని ఫిరంగిని మందుతోబాటు పాత ఫిరంగి గుండుతో దట్టించాడు. సరిగ్గా పన్నెండు గంటల వేళ, నాజీ యుద్ధనౌకమీదకి గురిపెట్టి ఫిరంగిని పేల్చాడు.

ఆ ఫిరంగి గుండు సరిగ్గా మందుపాతరమీద తగిలి యుద్ధనౌక పేలిపోయింది.

ఆ ముసలాయన నాజీలకి యెన్నటికీ దొరకలేదు. యెందుకంటే వూళ్లోవాళ్ల అతన్ని దాచేశారు. నార్వేకి స్వాతంత్ర్యం వచ్చాక ఆ ముసలాయనకి అత్యున్నత సైనిక బహుమతీ యిచ్చారు.

మామూలు విచిత్రమా! ముసలాడు ఓ పాత ఫిరంగిని పేల్చి శత్రుయుద్ధనౌకని నాశనం చెయ్యడం యెప్పుడోగాని జరగదుకదా.

# యింకో గడియారం కాపలాదారు గురించి

ఇవాన్ ఫెదోతొవ్ యే ఫిరంగీ యెప్పుడూ పేల్చలేదు. కానీ ఆయనకి ''లెనిన్‌గ్రాడ్ రక్షణార్థం'' పతకం యిచ్చారు. యెందుకంటే ఆయన కూడా ఒక సైనిక సాహసకృత్యం చేశాడు.

యుద్ధం* మొదలయే నాటికే ఇవాన్ ఫెదోతొవ్ ముసలాయన. ఆయన ఒక లెనిన్‌గ్రాడ్ ఇన్‌స్టిట్యూట్‌లో దగ్గర దగ్గర నలభై యేళ్లు గడియారపు కాపలాదారుగా వున్నాడు. ప్రతిరోజూ గోపురం యెక్కి యాభై కిలోగ్రాముల బరువున్న సీసపు గుండును లాగి గడియారానికి కీ యిచ్చేవాడు.

నాజీ బాంబులనుంచీ, కాల్పులనుంచీ, ఆకలినుంచీ తప్పించుకుని సురక్షితంగా వుండే చోటికి పోయే అవకాశం ఆయనకి వచ్చింది. కానీ ఆయన వద్దన్నాడు.

''నే వెళ్లిపోతే గడియారాన్ని యెవరు పట్టించుకుంటారు? ఒక వేళ యే తుపాకీ గుండేనా యిక్కడ తగిలి యిది నాశనం అయిపోతే? యీ గడియారాన్ని యెవళ్లు బాగుచేస్తారు? ఆకలి సంగతా.... లెనిన్‌గ్రాడ్‌లో వున్న వాళ్లంతా ఆకలితో మాడతారు. నేనూ వాళ్లల్లాగానే....''

ఆయన నగరంలోనే వుండిపోయాడు.

నగరం ముట్టడిలో వున్న తొమ్మిది వందల రోజులూ ఫెదోతొవ్ గడియారం ఒక్క క్షణం కూడా ఆగలేదు. లెనిన్‌గ్రాడ్ వాసులు దీన్నిబట్టి తమ గడియారాలు సరిదిద్దుకునేవాళ్లు. యుద్ధరంగానికి పోయే సైనికులూ అంతే.

ఒక ముసలాయన రోజూ మెట్లెక్కి పైకెళ్లి ఆకలితో నీరసించిన చేతుల్తో అంత బరువు యెత్తడం యెంత కష్టమో వూహించు.

లెనిన్‌గ్రాడ్ పౌరులు లొంగిపోలేదు, తెలుసా. ముసలాయన కూడా విజయదినం దర్శించాడు.

సోవియట్ ప్రజలు నాజీ జర్మనీమీద విజయోత్సవాన్ని జరుపుకున్న మే 9, 1945 నాడు కూడా ఇవాన్ ఫెదోతొవ్ మామూలుగానే గోపురం యెక్కి తన గడియారానికి కీ యిచ్చాడు.

# కాలాన్ని గురించి

యిప్పటికి నువ్వు యించుమించు పుస్తకమంతా చదివేశావు కదా. నిన్నో ప్రశ్న అడుగుతాను.

కాలం అంటే యేమిటి? యీ పుస్తకం అంతా ఆ మాటని వాడుతూనే వున్నాం కదా.

''ఓస్, అదేనా. కాలం అంటే గడియారాలు. ఉదాహరణకి అలారం గడియారం. అది ప్రతివాళ్లకీ స్పష్టంగా తెలుసు'' అని నువ్వు చెప్పొచ్చు.

అది స్పష్టంగా వుండచ్చు. కాని అది పూర్తిగా సరైన జవాబు కాదు.

---

* 1941 – 45లలో నాజీ జర్మనీకి వ్యతిరేకంగా సోవియట్ ప్రజలు చేసిన దేశభక్తియుత మహాయుద్ధం. – సం.

యెందుకంటే గడియారం కాలం కాదు, కాలాన్ని కొలవడానికి వుండే యంత్రం మాత్రమే. కాలం మనకి కనిపించదు. దానికి రంగు లేదు, వాసన లేదు, దాన్ని నువ్వు చేత్తో తాకలేవు.

చూడు, మనం తరుచుగా యెన్నో విషయాలని మన సంభాషణల్లో దొర్లిస్తాం. కాని చేత్తో తాకలేం, ఉదాహరణకి గాలి అలాంటి వాటిని.

అయినా కనిపించని గాలిని మనుషులు తూచడం నేర్చుకున్నారు. అలాగే కనిపించని కాలాన్ని కొలవడానికి స్పష్టంగా చూడగలిగి, తాకగలిగే గడియారాలని మనుషులు తయారు చేశారు.

# బళ్లోకెళ్లే పిల్లాడు వాస్య, జంతికలు, సెకన్లు

మనలో ప్రతి ఒక్కళ్లమూ కాలాన్ని సద్వినియోగం చేసుకోలేకపోతే గడియారాలు కాని, గడియారాలు చేసే వాళ్లు గాని యేమీ చెయ్యలేరు.

ఒక ఉదాహరణ చూద్దాం.

ఒక నిముషం అంటే యెక్కువా, తక్కువా?

ఒకొకళ్లకి నిముషం అంటే యెంతో! యింకొకళ్లకి లెక్కేలేదు. ఒకొకళ్లు ఒక నిముషంలో యెంతో చేసేస్తారు, యింకొకళ్లు గంటలో కూడా యేం చెయ్యరు.

''నాకు అయస్క్రీం కావాలి'' అని యెవరేనా వాళ్ల అమ్మని అడగచ్చు.

సూటిగా వుండే కోరికే అది. ఆ మాటలనడానికి పిసరు యెక్కువ తక్కువ లేకుండా క్షణంకంటే పట్టదు.

కాని అదే కుర్రాడు ''అమ్మా, వూఁ, మరేమోనే, నాకు అయిస్క్రీం కావాలి, అయిన్క్రీం. ఏం చేసి పెట్టవూ? వూఁ?'' అని గునుస్తూ పది సెకన్లు అడగవచ్చు.

మరి పది సెకన్లలో ప్రఖ్యాత సోవియట్ పరుగుపందెపు విజేత వలేరీ బొర్జోవ్ వంద మీటర్ల దూరం పరిగెత్తి ఒలింపిక్ బంగారు పతకం సాధించాడు.

కజ్జికాయలు చేసే యంత్రం ఒక నిముషంలో యాభై కజ్జికాయల్ని చేస్తుంది.

జంతికల యంత్రం ఒక నిముషంలో అయిదు కిలోల జంతికల్ని తయారు చేస్తుంది.

బళ్లో కెళ్లే పిల్లాడు యెనిమిది యేళ్ల వాస్య ఒక నిముషంలో యేమీ చెయ్యలేడు. అతను ప్రయత్నం కూడా చెయ్యడు. ఒక నిముషం చాలా తక్కువ అంటాడు.

మరి చూడు.

పది సెకన్లలో ఉపయోగకరమైంది యేదీ చెయ్యలేకపోతే, ఒక ఒలింపిక్ పతకం పోయినట్టేనా?

ఒక నిముషం వృధా చేస్తే అయిదు కిలోల జంతికలు చెయ్యనట్టేనా.

ఒక గంట వొట్టినే కాలక్షేపం చేసేస్తే మొత్తం ఒక అంగడి జంతికలు పోగొట్టిన బాధ్యత నీదేనా?

అదీ సెకనుకీ, నిముషానికీ, గంటకీ అర్థం.

నీ అలారం గడియారం పోతే యింకోటి కొనుక్కోవచ్చు. కాలం వృథాగా పోతే దాన్ని కూడదీసుకోవడానికి యేం చేసినా లాభం లేదు.

అందుకనే అస్తమానూ అంటూ వుంటారు, విన్నారా పిల్లలూ, పెద్దలూ!

కాలం విలువైంది!



అనువాదం: ఆర్వియార్
చిత్రాలు: వి. కుల్కోవ్




**Я. Длуголенский**
ЧТО ВЫ ЗНАЕТЕ О ЧАСАХ?
*На языке телугу*

**Y. Dlugolensky**
*CLOCKS AND WATCHES*
*in Telugu*



సోవియట్ యూనియన్‌లో ముద్రించబడింది

Д $\frac{4803010102-317}{031(01)-83}$ 348—83